శ్రీ ర స్తు.

శ్రీరామచంద్రాయనమః

శ్రీ నరసరాజుకవి విరచితంబైన

# దశరథరామశతకము.



ఇది

శ్రీమన్నీలాన్వయపయఃపారావార రాకాసుధాకరుండగు

వేంటస్వామినాయనివారిసద్గేహినియగు

శేషాంబాగర్భజనితసప్తమపుత్రుండగు

కృష్ణస్వామినాయనిచేఁ

బరిష్కరింపఁబడి

శ్రీరంగనాయకీవిలాసముద్రాయంత్రంబున

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

1894 సం॥

నెల్లూరు.

శ్రీరామజయము.

ధన్యాసిరాగము - ఆదితాళము.

శ్రీమన్నారాయణయనిమనమున చింతసేయవే మనసా ॥
సామజవరదుఁడుసహస్రారమున సాక్షియన్నఁడేమనసా ॥శ్రీ॥
నీమముతోడుతలోచూపునుమఱి నిక్కిచూడవేమనసా -
శ్రీమదఖండిత లక్ష్మీనరహరి చిన్మయరూపుఁడేమనసా ॥ శ్రీ ॥
భ్రూమధ్యంబున నిలచిచూచినను పురుషోత్తముఁడేమనసా -
ఆమహానీయునిఁగలసినవారలు అంతకవైరులె మనసా ॥ శ్రీ ॥
సమ్మదమొప్పఁగనష్టదళంబుల సదనముఁజేరవె మనసా -
సుమ్మిదితరగని యాంపోజ్యోతిని చూడవెమధ్యనుమనసా ॥శ్రీ॥
దుర్మతివాదముచేతనుమోక్షము దొరుకునటంటేమనసా -
నెమ్మనమందునగురుపాదమ్ముల నిలిపి చూడవే మనసా ॥శ్రీ॥
కమ్మవిల్తునీములుకుల దెబ్బకు కళవళపడకే మనసా -
కుమ్మరపురుగువిధంబుగభువిలోఁగుమురుగఁదిరుగవెమనసా ॥శ్రీ॥
భామలమనసనెవలలోపలపడి పకపకనగకే మనసా -
పామరవ్యాధినిచెండివైచినను పదవిదొరుకునే మనసా ॥శ్రీ॥
కామజనకునీస్మరణజేసినను కలుషముబాయునెమనసా -
కమలాసనునికి వేదములిచ్చిన గరుడధ్వజుఁడే మనసా ॥ శ్రీ॥
కర్మబంధములుచెండెటికోఱకై ఖండితయోగమెమనసా -
క్రమముతోడుతను నరసరాజదాస క్రమమిదెగదేయోమనసా ॥
శ్రీమన్నారాయణయనిమనమున చింతసేయవేమనసా ॥

---

సీ. వసుధపైనీలమువంశదుగ్ధాబ్ధికి పరిపూర్ణచంద్రుఁడీపరమపురుషుఁడు। కాంత జయంతవసంతాదులను మించు వరరూపలావణ్యవైభవుండు । కర్పూరకార దఘనహీరపారద మలయజాభ్రభఘనీ సమానయశుఁడు । చండకాండ ప్రభా మండితభుజదండ దండితాఖిలవైరిమండలుండు । సమర కర్కశుఁడద్భుతసాహసుండు । దానశీలుండుసత్యవిధాయకుండు । మన్మథాకారిదుర్జనమదవిదారి । భానురాడాకృష్ణగోపాలశౌరి ॥

శ్రీహయగ్రీవాయనమః.

# దశరథరామశతకము.

## కందపద్యములు.

క. శ్రీరమణీమణిఁదలఁచియు । హేరంబునిఁ గొలుతు శ
తకమొసఁగ మొసంగన్ । సారసలోచనుఁగృపచే । ధారుణివరికుం
తపాటి దశరథ రామా ॥ ౧ ॥ శారద నీవీకృతికిని । సారథివై
బ్రోవవమ్మ సరసోక్తులచే । నారసినినుఁగొనియాడెద । ధా
రుణి... ॥ ౨ ॥ గురువాసరంబునందున । గురునిన్ మనసం
దునిల్పి కోరికలలరన్ । నరహరిభజనయొనర్చెద । ధరణీ ॥
౩ ॥ వరకవితసెప్పుకృతిలో । దురితములెన్నున్నవాటిఁ దొలఁ
గించుటకున్ । సురనదిజనకునిభారమె । ధరణీ ... ॥ ౪ ॥
ఖరకరకులుఁడవుమిక్కిలి । కరధరనిభదేహకాంతిఁగలవాఁడను
చున్ । నెరనమ్మినాఁడనినుమది । ధరణీ... ॥ ౫ ॥ గిరిసు
తకుజపమునీవై । పరికింపఁగవేశ్యసుతునిపతనము తామై । పర
మందు సౌఖ్యమొసఁగితి । ధరణీ... ॥ ౬ ॥ కరివరద కమ
లనాభా । కరకంఠుని పరమమిత్రగానవినోదా । కరుణించిమ
మ్ముఁబ్రోవుము । ధరణీ... ॥ ౭ ॥ అరవిందజుఁడైనను భువి।
ధరధరధరుఁడైననిన్నుఁదలఁచకజయము । న్నిరవందఁ జేకొనం
ద్రఁట । ధరణీ... ॥ ౮ ॥ సిరిమాకొసఁగుమవనిమదిఁ। గురు
కురునీవనుటకొఱకుకుంజరపోషా । పరమోపాస్తియొనర్చితి ।
ధరణీ... ॥ ౯ ॥ శరధినిదాగిననిశిచర । వరునిన్ ఖండించి
మత్స్యవైఖరి తోడన్ । పరమేష్ఠికీవె శృతులను । ధరణీ ॥
౧౦ ॥ సురులసురులుక్షీరాబ్ధిని । తరవంగా గిరియుఁగ్రుంగుతరి
కమఠమవై । వెరవకుఁడని గిరినెత్తిన । ధరణీ... ॥ ౧౧ ॥

వరహామవై హేమాక్షుని । దురమునందునఁ బీచమణఁచిదోర్బల
శక్తిఁ । స్థిరముగనిల్పవె పుడమిని । ధరణిజా... ॥ ౧౨ ॥ న
రహరిరూపముఁగైకొని । కరిఁబోలు హిరణ్యకశిపు ఖండించి
యుఁదా। సురలకు సౌఖ్యమొసంగిన । ధరణిజా ... ॥ ౧౩ ॥
ధరబలిని మూఁడుపదములు । సరిదానంబడిగి పిదపఁ జరణద్వ
యిచే । స్థిరచెదలు నాక్రమించితి । ధరణిజా... ॥ ౧౪ ॥ సు
రపతికిని ముల్లోకము । లరయంగా నేలుటకును నాజ్ఞ యొసం
గఁ । బలిని నణంచిన వామన । ధరణిజా... ॥ ౧౫ ॥ ఇరువ
దియునొకటిమారును । స్థిరపతులనడంచి పిదప శ్రీవిప్రులకుఁ ।
వరదానమొసఁగుభార్గవ । ధరణిజా... ॥ ౧౬ ॥ కరమందలి
జపమాలను । బరువడిఁ ద్రిప్పుచును కుశికపౌత్రుఁడు నరిగెఁ ।
హరియుండుకోసలకుమటి । ధరణిజా... ॥ ౧౭ ॥ పురమేలె
డి దశరథునిఁ । ధరణీసురవరుఁడుచూచి ధర్మాత్మ్యకా । కురు
కురు శుభంబునీకగు । ధరణిజా... ॥ ౧౮ ॥ నరవరుఁడగు ద
శరథుఁడుఁ । సరిరాజసుతుండట్టంచు సంప్రీతిమెయిఁ । సు
రపూజలొసఁగెతపసికి । ధర... ॥ ౧౯ ॥ సురపూజలుగైకొ
నితా । పురహరసముఁలైన నీమపుత్రులనాతో । నరమరలెన్న
కఁబంపుమి । ధర... ॥ ౨౦ ॥ నరరాజేంద్రున కప్పుడు । గు
రుఁడువసిష్ఠుండుదెల్పె గోప్యముగువిధం । బరుదంద నిదినిజంబ
ని । ధర... ॥ ౨౧ ॥ సరసోక్తులఁగౌశికుఁడా । సురపతిసముఁ
డైన నృపుని స్తుతియింపంగా । వరసుతులఁ బనిచెఁదపసితో ।
ధర... ॥ ౨౨ ॥ స్థిరఖలుల ద్రుంచుకొఱకై । కరకులులకు బ
లబలాఖ్య కార్ముకవిద్యల్ । గురుఁడుపదేశమొనర్చెను । ధర॥
౨౩ ॥ కారణముకొఱకు తాటకి । ఘోరునవెను రేగుచేర భూ
తలమునబల్ । ధీరతతోసమయించిన । ధారు... ॥ ౨౪ ॥ క
సుకు సుబాహుప్రముఖుల । సరకుఁగొనకబాలులపుడు జన్నఁ

పుభూమిన్ । వరశరముల ఛేదించిరి । ధర... ॥ ౨౫ ॥ ధర
జన్మము నెరవేర్చియు । గురునకుహర్షంబొసంగి కువలయ పతు
లున్ । బిరబిర మిథిలకుఁజనిరఁట । ధర... ॥ ౨౬ ॥ పురము
లగెలిచిన శంభుని । కరకోదండంబుఁద్రుంచి కాశ్యపపుత్రిన్।
పరిణయమయ్యెనురఘుపతి । ధర... ॥ ౨౭ ॥ సారెలుదీరెలు
సైకొని । కూరిమిభూపుత్రిఁగూడి కువలయపోషా । చేరితివినీవ
యోధ్యకు । ధారు... ॥ ౨౮ ॥ అరమరచేమందరతన । దొర
సానికిఁజెప్పఁడొడఁగె దుర్వచనములన్ । సురదానవ రణమం
దున । ధర... ॥ ౨౯ ॥ వరయుగళ మొసఁగె నీవిభుఁ । డర
యంగానడుగనిదియయవసరమనినన్ । భరతునకు రాజ్య మి
మ్మని । ధర... ॥ ౩౦ ॥ సారసలోచనునడవికిఁ । జేరంగాఁ
బనుపుమనుచుఁజెప్పెను విభుతోఁ । బోరాడిద్రోహికైకయు ।
ధారు... ॥ ౩౧ ॥ ధరలో జనకునివాక్యము । పరిపాలింపంగ
లేనిపటుతనయులకున్ । పరలోకహానియనిమది। ధర...॥౩౨॥
శ్రీరాముండప్పుడుతన । నారీమణిఁగూడివేగనారణ్యమునన్ ।జే
రంగఁదలఁచివెడలెను । ధారు... ॥ ౩౩ ॥ కారులు వలుకుచు
రావణి । కూరిమిమేనత్తతన్ను కుసుమాస్త్రికళల్ । జోరుగఁ
దేల్పుమనంగా । ధారు... ॥ ౩౪ ॥ చేరఁగరమ్మని దానినిఁ ।
జీరితివఁట ముక్కుఁజెవులుఁజీకాకువడన్ । జారుచురక్తము వె
డలఁగ । ధారు... ॥ ౩౫ ॥ ఖరదూషణాది రాక్షస । వరుల
ను ఖండించి మించువైఖరితోడన్ । పరిపంథినృపులఁగూల్చిన।
ధర... ॥ ౩౬ ॥ సురపతిపుత్రునిఁ జంపియు । ఖరకర సుతుఁ
గాచినట్టి కంజాతాక్షా । శరణంటిఁబ్రోవరానను । ధర... ॥
౩౭ ॥ మారుతినలప్రముఖులచే । క్షారోదధిబంధనంబు గావిం
చివేసన్ । భోరునలంకకుఁదరలిన । ధారు... ॥ ౩౮ ॥ శర
ణనిన రావణానుజు । శిరమును మూర్కొనుచునీవుచెలిమియొం...

సర్పుల । నేరదాతత్రాణవహాహా । ధర... ॥ ౩౯ ॥ వీరరసం
బునుశైకోని । వారభటీవృత్తిచేత సమరార్థులఖల్ । ధీరతతో
పూర్తించిన । ధారు... ॥ ౪౦ ॥ దురమున రావణుశిరములు । శ
తములు ఖండించి త్రుంచి జగతీసుతతోఁ । బరగనయోధ్యకు నరి
గిన । ధర... ॥ ౪౧ ॥ శూరులకుదిగులుగలిగెడి । సీరము కర
మందు తేలుఁగఁ జెలఁగుచుఁదిరిగే । భూరమణ రేవతీపతి । ధా
రు... ॥ ౪౨ ॥ నారదమౌనియుఁగొల్వఁగఁ । గోరి పూజించితి
విభీష్మగోపకులిండ్లన్ । పేరిన పెరుగునుమీఁగడ । ధారు...॥ ౪౩
సారెకు గోపికలదరఁగఁ । దోరంబగు గుబ్బలదిమి తొడనల్పియుఁ
జాఁ । చేరెంబు లెత్తుబాలక । ధారు... ॥ ౪౪ ॥ ఊరింపుచు
నా చేడెల । చీరెలముఱివిచ్చిచూచి చిత్తంబలరన్ । చేరములు
జేయుమురహర । ధారు... ॥ ౪౫ ॥ మారుమందిరముమునుజూప
ని । కురచేడెల బిగియఁబట్టి గుబ్బలునొగలన్ । త్వరలో కూట
మొనర్చెడి । ధర...॥ ౪౬ ॥ కిలలలలల్ లల్లనఁగను । జిలిబి
లి సుద్దులతో నీవు చెలులందరినిన్ । కులుకు చుకూటమిఁజేసిన ।
ధర... ॥ ౪౭ ॥ వారలతల్లులు గనుఁగొనఁ । చేరెంబులు భా
రి కేరి పృథివీస్థలిపై । దూరంబుననిలుతువుగద । ధారు... ॥
౪౮ ॥ చీరెలు దట్టుక చేడెలు । జారిపయిన్ బడఁగఁబట్టి జంకు
నుదీర్చే । జారుండనను చుబొంకెడి । ధారు... ॥ ౪౯ ॥ చో
రుఁడవై వ్రేపల్లెలో । గారడములు జేయునట్టి కంసాంతకవా ।
వేరములెన్నకఁ బ్రోవుము । ధారు... ॥ ౫౦ ॥ సరిగమపదనిస్వ
నముల । గరమున వేణువునుభూని కాళీయుని భల్ । శిరము
లఁద్రొక్కుచుఁబాడెడి । ధర... ॥ ౫౧ ॥ గరుడ తురంగము
నెక్కియు । సిరినిన్ యెదయందునిల్పి స్థిరమతితోడన్ । నరుఁ
డనె పాండవునేలిన । ధర... ॥ ౫౨ ॥ సరగున ద్రౌపదిచీరె
లు । కౌరవ్యుఁ డొలువంగఁ జేయఁగడు వేగమునన్ । సారెకు

వలువ లొసంగిన । ధారు... ॥ ౫౩ ॥ గురుఁడును కృపుఁడు
ను భీష్ముఁడుం । కరిపుర సాధుండుగూడ కెవ్వడిగడియన్ । నరు
నకు జవమునొసంగిన । ధర... ॥ ౫౪ ॥ అరుణుఁడు గ్రుంకక
మున్నే । కురుపతిస్యాలకు శిరంబు కుంతీసుతుచేఁ । దరిగించఁగ
నీ కేతగు । ధర... ॥ ౫౫ ॥ కూరిమిసుతుఁడనిజననియు । ఘో
రసభవజనకుఁడనుచు సర్వజ్ఞనిధుల్ । పారణచేయుదు రెవ్వా
డు । ధారు... ॥ ౫౬ ॥ జారుఁడవని గోపాలురు । ఘోరుఁడె
యుతఁడనుచు సాల్వకూరులు ధరలో । నోర్చఁబొగడసాగిరి ।
ధారు...॥ ౫౭ ॥ వరబావమరిది యనిమది । ధరఁబాండవుల
నిరిగాని తారకరాముం । డలరెనటంచని తెలియరు । ధర ॥
౫౮ ॥ పరులకునీమాయయు మది । పరికింపఁగనీక చెలఁగిబహు
లీలలచే । దొరతనముఁజేయుబాలక । ధర... ॥ ౫౯ ॥ ధర
యెల్ల మ్లేచ్ఛదొరలని । తురగారోహణ మొనర్చి ధూర్జటివలెనా
పరుషహరించెడి కలికివి । ధర... ॥ ౬౦ ॥ కరములు మోడ్చి సు
రావళి । పరిపరివిధములను నిన్నుఁబ్రస్తుతిసేయన్ । బరిమార్చి
తౌర దనుజుల । ధర... ॥ ౬౧ ॥ స్థిరమానసమున మర్త్యుఁడు ।
హరిహరియని ప్రస్తుతింప హర్షముతోడన్ । సిరినొసఁగుచుఁగా
పాడెడి । ధర... ॥ ౬౨ ॥ నరుఁడేకులజుండైనను । మురువ
క శ్రీరామనామమంత్రము నుడువన్ । నరకముఁదొలఁగుట యసు
రుదా । ధర...॥ ౬౩ ॥ ఘోరములగు పాపంబులు । నారా
యణస్మరణమదిని నాటినయంతన్ । శౌరాకులవిధమునఁజను ।
ధారు...॥ ౬౪ ॥ మరకతమాణిక్యంబులు । విరళంబుగఁగుంద
నంబు వేసినమకుటం । బరయఁగశిరమునఁదాల్చిన । ధర... ॥
౬౫ ॥ మారుతసూనుఁడు నినుహృ । త్సారసమునఁ నిల్పిభక్తిస
లిపినయంతన్ । తారకయోగముఁ జెప్పిన । ధారు... ॥ ౬౬
తరుణీమణిరూపంబున । సారునిం మెప్పించినట్టి హరివీవగదా ।

రు తెలిసిగినమానవులకుఁగొదువయులేకన్ । వరవైకుంఠము గ
లుగును । ధర... ॥ ౭౨ ॥ శ్రీరమణీహృదయేశ్వర । వారిజ
దళనేత్రక్షీరవారిధిశయనా । ధీరుఁడవనినినునమ్మితి । ధారు ॥
౭౩ ॥ నారాయణనీనామము । కోరిపఠించిననుగలుగుఁగోరిక
లెల్లన్ । వేరొకనామంబేటికి । ధారు... ॥ ౭౪ ॥ చరమచ
రములీరెండును । పరికింపఁగనీవెయాను ప్రణతావననిన్ । సు
రతంబునమ్మిగొలిచెద । ధర... ॥ ౭౫ ॥ అరయంగఁదీర్థయా
త్రల । కరుగుచు యాగాదికర్మలన్నియుఁజేయన్ । దొరుకును
మోక్షసుఖంబులు । ధర... ॥ ౭౬ ॥ తరుణీకుచములఁగాంచి
యు । భరియింపఁగలేని మోహపాశంబులచే । నరులిట్లుబద్ధు
లయ్యిరి । ధర... ॥ ౭౭ ॥ నారీమణిపైనునిచెడి । మారిమి
తో నిన్నుఁగొలువఁ గొదువలులేకన్ । కోరికలెల్ల ఫలించును।
ధారు... ॥ ౭౮ ॥ కీరమునుజానకియైనను । సారెకుమీపేరఁబి
లుచు సజ్జనులకు బల్ । కోరిన వరములొసంగెడి । ధారు ॥
౭౯ ॥ పరజనులకు నుపకారము । పరగంగ నొనర్చి నీకు భ
క్తుండైనన్ । నెరపగు సంపదలొసఁగెడి । ధర... ॥ ౮౦ ॥
కరివరద కమలలోచన । గరుడధ్వజ కామజనక కాంచనచేలా।
కరుణించి సిరులొసంగుము । ధర... ॥ ౮౧ ॥ సారములేకుఁ
డెడిసం । సారంబిదంగ లేక సద్గురుకరుణన్ । కోరియు నిను
గంటినిగద । ధారు ॥ ౮౨ ॥ ఘోరత్వముచేఁగొందరు । పో
రునఁజచ్చినను పరమభోగంబనుచున్ । నోరూరఁ బలుకుటలు
వృథ । ధారు... ॥ ౮౩ ॥ గురుమూర్తిని సేవింపక । దొరు
కునె నీదర్శనంబు దోషములణఁగన్ । కరుణింతువెటుల శ్రీహ
రి । ధర... ॥ ౮౪ ॥ అరిషడ్వర్గములెల్లను ।హరియింపఁగఁజే
సినట్టి యార్యులకునునీ। వరయఁగదరిశనమిెయ్యవె । ధర... ॥
౮౫ ॥ అరయఁగ మూలప్రకృతియు । విరివిగ బ్రహ్మాండమైన

రు తెలిఁగినమానవులకుఁగొదువయు లేకన్ । వరవైకుంఠము గలుగును । ధర... ॥ ౭౨ ॥ శ్రీరమణీహృదయేశ్వర । వారిజదళనేత్ర క్షీరవారిధిశయనా । ధీరుఁడవనినినునమ్మితి । ధారు ॥ ౭౩ ॥ నారాయణనీనామము । కోరిపఠించినను గలుగుఁగోరికలెల్లన్ । వేరొకనామంబేటికి । ధారు... ॥ ౭౪ ॥ చరమచరములీరెండును । పరికింపఁగనీవెయౌను ప్రణతావననిర్ । నిరతంబునమ్మిగొలిచెద । ధర... ॥ ౭౫ ॥ అరయంగఁదీర్థయాత్రల । కరుగుచు యాగాదికర్మలన్నియుఁజేయన్ । దొరుకునె మోక్షసుఖంబులు । ధర... ॥ ౭౬ ॥ తరుణీకుచములఁగాంచియు । భరియింపఁగలేని మోహపాశంబులచే । నరులిట్లుబద్ధులయ్యెరి । ధర... ॥ ౭౭ ॥ నారీమణిపైనునిచెడి । కూరిమితో నిన్నుఁగొలువఁ గొదువలు లేకన్ । కోరికలెల్ల ఫలించును । ధారు... ॥ ౭౮ ॥ కీరమునుజానకిమైనను । సారెకుమీపేరఁబిలుచు సజ్జనులకు బల్ । కోరిన వరములొసంగెడి । ధారు ॥ ౭౯ ॥ పరజనులకు నుపకారము । పరగంగ నొనర్చి నీకు భక్తుండైనన్ । నెరపగు సంపదలొసఁగెడి । ధర... ॥ ౮౦ ॥ కరివరద కమలలోచన । గరుడధ్వజ కామజనక కాంచనచేలా । కరుణించి సిరులొసంగుము । ధర... ॥ ౮౧ ॥ సారములేకుండెడిసం । సారంబీదంగలేక సద్గురుకరుణన్ । కోరియు నినుఁగంటినిగద । ధారు ॥ ౮౨ ॥ ఘోరత్వముచేఁగొందరు । పోరునఁజచ్చినను పరమభోగంబనుచున్ । నోరూరఁ బలుకుటలు వృథ । ధారు... ॥ ౮౩ ॥ గురుమూర్తిని సేవింపక । దొరుకునె నీదర్శనంబు దోషములణఁగన్ । కరుణింతువెటుల శ్రీహరి । ధర... ॥ ౮౪ ॥ అరిషడ్వర్గములెల్లను । హరియింపఁగఁజేసినట్టి యార్యులకును నీ । వరయఁగదరిశనమియ్యవె । ధర... ॥ ౮౫ ॥ అరయఁగ మూలప్రకృతియు । విరివిగ [illegible]

విధమట్లుండగ । హరినిన్నందురు లోకులు । ధర... ॥ ౯౬॥ పరమాత్మ నీప్రభావము । నెఱుఁగక వాదింతురెపుడు నిపుణత్వముచే । హరినిన్నుఁగానలేకను । ధర... ॥ ౯౭ ॥ పరమాత్ముఁడిట్టివాఁడని । పరికించిన యోగిజనుల భావము తెలియగ। హరినామదిరంజిల్లెను । ధర... ॥ ౯౮ ॥ గరిమసువర్ణమునానా । భరణములగుచున్నవిధము ప్రకృతిహితుఁడవై । సురనరమృగములు నీవే । ధర... ॥ ౯౯ ॥ గరుడోరగకిన్నరకిం । పురుషులు మతిసిద్ధులాది పూర్వులకెల్లన్ । కరుణతో ముక్తినొసంగిన । ధర... ॥ ౧౦౦ ॥ అరయంగ జగములన్నిటి । భరియించెటి దొరవునగుచుఁ బాలించెదవా । పరమాత్మభక్తవరదా । ధర... ॥ ౧౦౧ ॥ అరమరలేకను నీపద । సరసిజముల నమ్మినట్టి జనములకెల్లన్ । పరిపూర్ణసుఖము లొసఁగెడి । ధర... ॥ ౧౦౨ ॥ వరదాయని సతతంబును । మొరలిడినను కృపయుఁగలిగి ముక్తినొసంగన్ । హరిహరి నీకేతగురా । ధర... ॥ ౧౦౩ ॥ కరివేల్పువగుచు జీవులఁ । బరిపాలనసేయునట్టి బాధ్యతగలుగన్ । కరువేల నొసఁగెదవుహరి । ధర...॥ ౧౦౪ ॥ నారదుఁడనవరతంబును । కోరిభజించినను సకలకోరికలును చే । కూరఁగ నొసఁగితివౌభళి । ధార... ॥ ౧౦౫॥ నరజన్మమె త్రిగాత్రుస । వరులను వధియించుకొఱకు వారిధిదాటన్ । హరిహరిహరి నీకేతగు । ధర... ॥ ౧౦౬ ॥ ఇరుమూడుమతములందున । జరియింపఁగనేమికద్దు సద్గురు కృపచే । గురిపెట్టి నిన్నుఁగనవలె । ధర... ॥ ౧౦౭ ॥ ఘోరాహవశూరాసుపి । చారావరమీరవేగ జానకిరమణా । కోరి భజించెద నిరతము । ధార... ॥ ౧౦౮ ॥ పరమేశ్వరుండుపార్వతి । కిరవుగ నీనామమహిమ కృపనెఱిఁగింపన్ । గురుతెడిజపమొనరించెను । ధర... ॥ ౧౦౯ ॥ సరసిజబాంధవు చేతను

పరికింపఁగ దివసమేరుపడినవిధమునఁ । హరినీవలన జగంబు
లు । ధర... ॥ ౧౧౦ ॥ వరవిశ్వోద్గతికారణ । పురుషుఁడవీవ
నుచు సురలు బొగడెదరెపుడున్ । ఉరగేంద్రశయన శ్రీహరి ।
ధర... ॥ ౧౧౧ ॥ తారకయోగముచేనిను । నారయఁగాఁదె
లియవచ్చు నటువలెఁగాకిం । కేరీతినఁగననగునో ।ధారు... ॥
౧౧౨ ॥ ధరజనకులగోత్రజ్ఞుఁడు । పరమార్థకృతంబొనర్చుపద్య
ములమహిన్ । సురలు వినుతింపఁగ్రాకొనె । ధర... ॥౧౧౩॥
వరనీలమువంశోద్భవుఁ । డరయంగా కృష్ణస్వామినాయఁడుభు
విలో । విరివిగఁ బ్రచురముచేసెను । ధరణిన్ వరికుంతపాటి
దశరథరామా ॥ * * * * * * ౧౧౪.

ఆనందభైరవి రాగం - అట తాళం.

పల్లవి.

లక్ష్మణాగ్రజసీతారామా - భజరే-మోక్షమియ్యరభక్తస్తోమా

అను పల్లవి.

రక్షించుమమ్మునుపక్షివాహావేగ -
మోక్షమియ్యకపోతే దీక్షచేసాధింతు ॥ ల ॥
పక్షవిక్షేపముతోరాక్షసమాయల -
శిక్షజేసినట్టి క్షితిసుతసుతహరి ॥ ల ॥
అక్షరావ్యయుఁడా పక్షూరనిలయుఁడ
సూక్ష్మముగానీదయ సాక్షాత్కరించర ॥ ల ॥
కుక్షినుండవెడలి ప్రత్యక్షమైజననీకి -
మోక్షమొసంగిన రాక్షసదమన శ్రీ ॥ ల ॥
మోక్షముకోఁజూడు విరూపాక్షనరసింహా
నీక్షితి జన్మించి నీశతకమొనరించె ॥ ల ॥

## సీ స మా లి క.

దశరథమేదినీధవునకుసుతుఁడవై తాటకిమర్దించితత్క్షణమున । గా
ధితనూజుయాగంబుసంరక్షించినాతిశాపముదీర్చిఖ్యాతిమించి ।
పశుపతినవమంబుదిశలుమెచ్చఁగఁద్రుంచి సీతనుపెండ్లాడి సిరు
లవెలసి । అఖిలరాజులనెల్ల నాహవంబునగెల్చి భార్గవరాము
ని ప్రతిన జెరిచి । జనకాజ్ఞచేకొని సతితోడనప్పుడు అనుజన్ముఁ
డును తానునడవికేగి । రక్కసిచెవులును ముక్కును జెక్కిం
చి ఖరదూషణాది రాక్షసులఁజంపి । కర్బుర మృగమును ఘడి
యలోన వధించి సీతను గోల్పోయి చింతనొంది । సూర్యపు
త్రునిఁజూచికార్యమంతయునెంచి గహనంబువెదకుచుఁగదలివే
గ । శత్రుచేనొచ్చియు శ్రమపడుచున్నట్టి ఖగరాజుఁగన్గొనికరు
ణతోడఁ । బరికించి యతనికిఁ బరక్రియల్ గావించి తమ్ముఁడు
గొల్వంగఁ దరలియచట । సంచారమొనరింప శబరి యిచ్చిన
పండ్లు మించినవేడ్క భుజించిపిదప । దుష్కరంబైతగుకిష్కిం
ధ కేతెంచి వాలిఁగూలఁగనేసివానిరాజ్య । మంతయుసుగ్రీవుక
భిషేకమొనరించి సుజ్ఞానియగువాయు సుతునివలన । సీత పో
బడిగాంచి భూతలంబదరంగఁ గోఁతులుగొల్వ విఖ్యాతిగాంచి ।
వారిధిబంధించి వడిగలంకకుఁజేరి పట్టణంబంతయు ముట్టడించి ।
రావణుభంజించి రాక్షసప్రభునిగా సరమవల్లభుఁజేసి సంభ్ర
మమున । భూసుతను వెంటఁ దోడ్కొని పురముజేరి । యిల
ను నరసింహదాసునినేలుకొఱకు । నమర పట్టాభిషిక్తుఁడ వైన
రామ । చంద్రయీకృతినేలుము చంద్రసూర్య । తారలెందా
కనుండు నందాకభువిని ॥ * * * *

ఏకపాత్రిసముముక్షుదశరథరామశతకము,

సంపూర్ణము.



